# [illegible]సుబోధిని.

దాట్ల సీతారామరాజుగారిచే రచియిం

పంబడి

సి. హెచ్, రామమూర్తి అండ్ స

న్సువారి స్వకీయ ముద్రాక్షరశాల

యందు ముద్రింపించి ప్రచురింప

బడియె.

మొదటికూర్పు 630 ప్రతులు

విజయనగరము.

వెల రు 0–1–0.

1910

PRINTED BY MUKKU ATCHUTARAMAYYA.




శ్రీరామ

# సతీసుబోధిని.

—:(o):—

క॥ నిరతంబు భక్తకోటికిఁ। బరమంబగు సౌఖ్యమొసఁగిపాలించెడి శ్రీ। కరునాద్యంత విహీనునిఁ।గరుణానిధి దేవదేవు గణుతింతుమదిన్॥

క॥ పలువురు సెప్పినీతులె। పలికెను లేవిందనూత్న పద్ధతులంచుం। దలఁపోయుచు నిరసించఁగ। పలదుసుఁడీమంచిఁగొనుఁడి భావములోనన్

గీ॥ తప్పులున్నను పైకొక తప్పకుండ। సారమే గ్రహించునెప్పుడు సజ్జనుండు। నీళ్లుపాలుమిళితమైన నీళ్లవిడిచి। పాలఁగొనునట్టి రాయంచపక్కిఁబోలె॥

క॥ పాతివ్రత్యమహాత్త్యము। చేతనరుంధతి మొదలగుచేడియలెంతో। ఖ్యాతిఁగనిరివారివలెన్।భూతలముననడచుకొమ్మ పొలఁతీనీవున్॥ 1

క॥ పతిభక్తికంటెమించిన।వ్రతంబు లేదుపయిడలికిభామామణిరో। మతిఁదలఁపోయనదివినా। వ్రతముల నోములనొనర్చవట్టివృధసుమీ॥ 2

క॥ ఉపవాసంబులు వ్రతములుఁ।దపములుఁ [illegible] వేలకంటెఁదర్కింపంగా। నవరిమితపుణ్యమ

క॥ పతిదైవమంచునాతని। హితమెఱిఁగిమెలంగు
నట్టిమెలనాగలకుఁ। క్షితియందు సర్వసౌఖ్యము।
లతులితముగఁ గల్గుచుండునత్యంతంబుఁ॥4

క॥ పతికంటెమించుదైవము। సతీమణికి లేఁడు
మదినిఁ జర్చింపంగా। క్షితిలో నాతనికి మిగుల।
హితముగనడవంగవలయునెల్ల విధములఁ॥ 5

క॥ నవమాసంబులుగర్భము।నవహించిమిగు
లశ్రమఁగొనినజననియెడల। న్నవలాభక్తి శ్రద్ధ
ల।నవనిన్నిలగంగవలయునార్యులుమెచ్చఁ॥ 6

గీ॥ వెలఁదివిద్యయుబుద్ధినేర్పించి యోగ్య। వం
తురాలినిఁగాఁ జేసిస్వాంతమందు।నారెకునునీదు
సౌఖ్యంబుఁగోరుచుండు। జనకుచోనుంచుభక్తి
విశ్వాసములను॥ 7

గీ॥ఒక్కతల్లికిజనియించియొక్కయింటఁ। బెరిఁ
గిమనినట్టినీదుసోదరులతోడ। సోదరీలతోఁగల
హంబునూపఁబోకు। మువిదయ న్యోన్యమైత్రి
తోనుండుమెపుడు॥ 8

క॥ మఱఁదులఁగనుమెప్పుడుసో।దరులగతిఁజి
లుకలకొలికిఁదగుగౌరవముఁ। ధరనెఱపుము
బావలయెడ। మఱిమామలయెడ నిరతము

మాన్యతవచ్చుఁ॥ 9

గీ॥ తోడికోడండ్రుతామెప్డుఁగూడియుండఁ। బోలుఁగాట్లాడిజ్ఞాతులను డువవలవ। దోకరి యెడలోపముండిన నొకరుసహనమునువహిం చఁదగునెదురొక్కఁబోవుటుడిగి॥ 10

క॥ వినుమాఁడుదిసదివినఁజెడు। ననియవి వేకులువచింప నదియెన్నఁకునీ। మనముననెద్దేమి యెఱుఁగు। వనితాయడుకుల్లరుచిని వసుధాస్థ లిలోఁ॥ 11

క॥ విద్యావిభవముజనులకు। హృద్యంబొన రించుఁగాదె యెంతయుఁదలఁపఁ। వేద్యులుతె లుపుటవినవే। విద్యాహీనులఁ బసులనివెలఁదీనీ వుఁ॥ 12

గీ॥ చదువులేకపోవుటచేతసఖియయిరుగు। పొరుగువారితోఁగయ్యంబువొందుచుండు। గ వ్వలనుగచ్చకాయలగడుపుచుండుఁ। గాలము ను వ్యర్థమొనరించిఘనతఁబాసి॥ 13

గీ॥ చదువెఱుఁగనివధూటియసంగతముగ। సారెకునునీచులచెలిమిఁగోరుమంచి। చెడ్డలగ్రి హింపలేదు దుశ్చేష్టలఁగొను। వసుధనలుపురి

లోనవ్వఁబొట్లఁగాంచు॥ 14

గీ॥ విభుఁడువిద్యాధికుండౌచు వెలయుచుం
డ। భార్యవిద్యావిహీనతఁబరఁగుచుండ। వారి
సంసారమేగతిబాగుపడును। గాటికొక రేటికొ
కరులాగంగలలన॥ 15

గీ॥ విద్యయన్నింటఁ బై పెచ్చు విలువహె
చ్చు। నిచ్చలునుమెచ్చుసౌఖ్యంబులిచ్చునెంతొ।
మంచిఁదెచ్చుఁజెడ్డనుబుచ్చుమగువవిద్య। వీలు
లేదనుటేమివివేకమొక్కొ॥ 16

గీ॥ విద్యమిక్కిలినేర్చినవినయముండ। వల
యునదిలేనిచోరసవంతమౌను। యెంతసక్కఁగ
వండినవేమిఫలిత। ముప్పులేనికూరకురుచియుం
డునొక్కొ॥ 17

గీ॥ చదువునేర్పితిమంచునుజనదుబిల్లా। శీ
యతారాశశాంకాది నీతిబాహ్య। మైనగ్రంథ
ములఁజదువఁగానుజెలియ। వానిపేరై ననువినఁ
గవలదునలదు॥ 18

గీ॥ కాంతపనిలేకతీఱికఁగాంచునపుడు। కా
లమునువ్యర్థమగునట్టికార్యములను। బోవనీక
పతివ్రతపాలఁతుఁలగు। చరితములనుజదువవ



గీ॥ కుడిచికూర్చున్న (బని లేక చెడుతలంపు
ఉద్భవిల్లునే దైనసీవొప్పుగాను। సచ్చరిత్రము
లంజదువంజర్చ సేయం। గాలమెప్పుడుగడుపుము
కంబుకంఠి॥ 20

గీ॥ బీదసాదలం గడు హెచ్చు ప్రేమతోడ।
గాంచిసాయంబు సేయుముకసరంబోకు। నీకుంగ।
లశక్తి కొలందినిలోకమందు। ధర్మ మొక్కటెని
నుగాచుందలిరుంబోండి॥ 21

గీ॥ జగతిపై జన్మమెత్తినసార్థకంబు। పరుల
కుపకార మొనరించు కొఱకుంగాదె। యెన్నికా
ర్యములేసినయింతియెపుడు। మంచిచెడ్డలురెం
డునుమహినినిలుచు॥ 22

గీ॥ కాళ్లు సేతులు మొదలగంగములు లేని।
వారికినిరుపేదలకునువలయునెపుడు। దానమొ
నరింపనిన్మెచ్చంగానెమెమటం।బొంగిద్రవ్యంబు
వృధపచ్చంబోకుతరుణి॥ 23

క। ఇచ్చెదననిదీనులతో। నిచ్చకముల నెదు
టనాడు చెగవేయుచురే। పిచ్చెదమాపిచ్చెదనని।
గచ్చులు సేయంగంబోకుకమలసుగంధి। 24

గీ॥ అతివయాచకతతినీసహాయమడుగఁజే
యునదిమానునదియును జెప్పెవెయ్య। వలెను
వెంటనెత్రిప్పఁగవలదుమళ్లి। మళ్లిరమ్మనిపొమ్మ
నికల్లలాడి॥ 25

గీ॥ పతిగృహమునకుఁ దెచ్చుద్రవ్యంబు చి
ల్లిగవ్వయినఁగానివ్యర్థంబుగాకయుండఁ। బొ
దుపుగావాడవలెఁజుమ్మిపొలఁతిరోఁచెడు। కర్చుల
ను జేయఁగానపఖ్యాతివచ్చు॥ 26

క॥ వదలఁగవలెదుశ్చేష్టలఁ। జదువఁగవలెఁ
బుణ్యసతులచారిత్రంబుల్। మెదలఁగవలెనా
థునిమది। ముదమగునటులెల్లగతులఁబూర్ణేందు
ముఖీ॥ 27

క॥ వినవలెవిబుధులచరితలఁ। గనవలెసచ్చె
లులగోష్ఠిఘననిభవేణీ। మనవలెఁగీర్తిప్రతిష్ఠల।
ననవలెనిక్కంపుమాటలనవరతంబున్॥ 28

క॥ సత్వముఁదాల్పందగున। జ్ఞత్వమువిడ
నాడవలయు సతిపనిఁగోదా- సీత్వముపతియెడఁ
దగులా- కేత్వసెప్పంగఁబోకుమెపుడర్థులకున్॥

క॥ నడువకుమాకుపథంబుల-గడువకుమా
భర్తయాజ్ఞఁగలలోనైనన్- నుడువకుమాడు

ర్యాపల- విడువకపూబీదలందు వెలఁ దిరో పే్రి
మకా॥ 30

క॥ స్రుక్కకుమిడుములఁబడియును- నిక్క
కుసీవిభవముఁ గనిసీరజనేత్రి—చిక్కకు మప్పుల
లోపల—మెక్కకుమితిమీఱిసీవుమేదినిలోనకా॥

క॥ ఆడకు పతిశలవునకేదు। రాడకురస
హీనపుఁ బలుకాడకుసీతి। స్వీడఁగనాడకుధరఁ
బో। నాడకుసీబంధుజనుల నబలామణిరో॥ 32

క॥ నవ్వకు కడుహెచ్చుగమన। సివ్వకుదు
ర్మార్గజనులకెన్నఁడొకరితోఁ। జవ్వకుఁగాల్ద్రివ్వ
కుమటి।త్రివ్వకగతముస్మరించితామరసాక్షి॥33

గీ॥ గంగిరెద్దువలెఁ దనయంగంబునిండ। వ
స్త్రుపులఁబెట్టుకొన్నఁ బ్రశస్తమౌనె। యతివకం
తకంటె మిగులయశముగాదె। సాయమొనరిం
పఁగాబీదసాదలకును॥ 34

క॥ అదిలేదిదిలేదనిపతి। యెదకుంగష్టంబు
లిడకుమెప్పుడునెలఁతా। ముదమొందుమున్నదా
నితో। సదమలమగుతుష్టికంటె సౌఖ్యముగ
లదే॥ 35

క॥ చెడుగులతో స్నేహంబె। య్యెడలను జే

యంగఁబోకుమీ శ్రాద్ధమునా। యిడుములపా
లౌడుబయ। ల్పడనీయకు మింటిగుట్టుఁ బదుగు
రిలోనఁ॥ 36

క॥ పతిపొరుగూరికిఁబోయిన। క్షితిలోసిం
గారమూనఁ జెల్లదుగరితా। సతతముపాతివ్ర
త్యాల। మతముసుమాయట్టులుండ మదినర
యంగా॥ 37

క॥ పెద్దలువృద్ధసతులునీ। వద్దకువచ్చినను
లేవవలయును వారిఁ దద్దయుఁ గూర్చొమన
వలె। ముద్దియమర్యాదసేసిముదములరారఁ ॥38

గీ॥ సిరియదెంతయుండినఁ గానిధరణినంత
కంటెవేయిరెట్లడఁకువఁగానదిరుగ। వలయుగ
ర్వమెన్నఁడునుదాఁబనఁటఁదగదుశాంత మఖిల
గుణాలి భూషణముసూవె 39

క॥ సతినీదుసచ్ఛరితముకు। మతీజనులకిత
ములేమిమర్యాదవిహీ। నతయానెదానఁగుక్క
కు। క్షితిఁగిట్టనిచో ఘృతముప్రసిద్ధికిలోనే॥40

క॥ చాడీలుసెప్పఁబోకుము। చేడియమర్యా
దసెడును సిద్ధముసుమ్మీ। వీడుదురుపెద్దలుని
నుఁ। గూడరు మఱునాఁటినుండి కోరికతో

క॥ మానముమించియు వేరే। కానముకో
మలికిముఖ్యగతియయ్యెదిస। మ్మానముమూల
ము సేయుము। హీనముగాకుండ నెప్పడెల్ల విధ
ములన్॥ 43

గీ॥పతిగృహమునకు రాఁగానె వనజనేత్రి।వల
దుసంసారబాధలఁదెలియఁబర్చ। సేదఁదేరినపిమ్మ
టఁజెప్పమెప్ప। దాతనిమదికిఁగష్టంబులఁబ్బనీకు॥

గీ॥ కించఁగాని నిన్ను మిగులబాధించె నేనిఁ।
బతికిమార్గాటవచియింపవలదుసుమ్మ। కరము
కఠినచిత్తుడయినఁగరఁగకున్నె। కలికశాంతప
ర్పుమ్మృదువాక్యములచేత॥ 44

గీ॥ ఎంతసంపత్తిఁగల్గిననెంతసౌఖ్య। ముండి
ననుగానిసంతతియుండకున్న। శోభయినుమం
తయుండదుసుందరాంగి। దైవమును వేఁడునీకు
సంతానమిడఁగ॥ 45

క॥ పిల్లలుకల్లలుపలికిన। నల్లరఁగావించెనే
నినదివారింపన్। జెల్లునుముద్దించంగాఁ। జెల్ల
దటులఁజేయఁబిదపఁజెట్టగులేమా॥ 46

గీ॥ తగదుబిడ్డలరఁజేయఁదఱచుతినఁగఁ।

దల్లిమేదియో యిచ్చి యోదార్చుచుండు। న
వలయట్టు లొనర్చనసర్థ మొదవు। వారి దేహము
లకటులవలమసేయ॥ 47

క॥ పండుగులుశుభము లగుచోఁ మెండు
గవస్తువులు వెట్టిమెలఁతలువిడుదు। రొ్ౕండిక
లనువీథులనె। న్నండదియువలదిలసవగుణంబ
గుమడఁతీ॥ 48

గీ॥ పొరుగువారిపైఁ గోపంబు వృథమఁదమ
దు నోరెఱుంగ నిబిడ్డలనూర కేని। బాదుచుంద
రుపశువులవ లెనుగొంద। రట్లుసేయఁగాఁ బోకు
మోయబలసీవు॥ 49

గీ॥ తఱచుగాబిడ్డలకుఁదమతల్లులగుణ। మ
లవడునుగానఁ బ్రిమదగయ్యాళి వొచు। బుద్ధి
మాలినటింపంగఁబోకవిద్య। నేర్చివినయవివేక
ములెన్నె అపుటొప్పు॥ 50

గీ॥ పణఁతిసీయెడఁబతికంటె గుణగరిమము।
లావుగానున్న వానికెల్ల సమయములు। లొంగి
యుండుమువిూఱకులోకమందు।సదియెయుత్త
మోత్తమగుణంబనుచుఁదెలిసి॥ 51

గీ॥ నాథుఁడింటికిరాఁగానెనాతిసీవు। బూచి

లాగుతలవిగయఁ బోసియుండ। వలపుశుభ్రము
గాఁగనఁ బడఁగవలయు। నెప్పుడతనిమదికిముద
మెసఁగఁగాను॥ 52

క॥ పెనిమిటితన పైమిక్కిలి। చనవునుగనఁ
బర్చుచున్న సతిమూఢఁకుపతో। డనెమునఁదగుఁద
ననడువడి। ఘనులుమదినిమెచ్చునట్లుఁగానిర
తంబుగ॥ 53

గీ॥ ఇలనునీమపుట్టింటవారెంతధనికు। లై
నఁబతితోడదేలోకమంచునతని। కడనెయుండ
వలయుఁగాని కదలరాదు। చెలియమెట్టియిడు
ములగాసిల్లుచున్న॥ 54

క॥ పతిగడియించెడి దినములు। సతివకుగు
సగుసలులేనియట్టి తరుణమం। దతిరోసరోసలు
నుగూడదు। మతిసమముగనెప్పుడెంచ ,మర్యా
దసుమీ॥ 55

క॥ మంచులువాకులువెట్టిన। సుందరిప
తిలోఁ బహునను చుండలఁపకుమీ। దండమున
దానవ్యాధులు। పొందియునుపుష్ఠ ప్రేమ
ప్రోవునుజుమ్మీ॥ 56

గీ॥ స్వప్నమందైన నాథునిభావమునకు।

మిగిలినడవక యాతండుమెచ్చునట్టు లనయ
మును మెలఁగుట యెవశ్యావమథంబు సకియమం
త్రతంత్రములు బూటకములెసును॥ 57

గీ॥ చానసీతోడఁ బతిరహస్యంబువల్కఁ
జెలులతో నైన నెన్నఁడుఁజెప్పబోకు చెడుప
డంతులు లేనివి సెప్పినీదు పతికివిరసంబు పు
ట్టింతుభావమందు॥ 58

క॥ పతిహితులనాదరించుచుఁ బతిశత్రుల
విడువఁగాను వలయునువారల్ సతినీకుమిత్రు
లైనను క్షితిలోపలగౌరవంబు సేకురుదానన్ 59

గీ॥ మోదహీనుఁడైనను దానుమోదహీ
న యగుచు మోదభరితుఁడైన నతివమోద
భరితురాలౌచు నాథుని స్వాంతమునకి తంబు
గనడవవలెఁబూవితావిఁబోలె॥ 60

గీ॥ విధివశముచేతనీకుఁ బ్రాప్తించినట్టివ
రుఁడుబుద్ధిహీనుండుని ర్భాగ్యుఁడైన నెట్టిరూ
పహీనుండైన నెంతమాత్ర మతనియనుమతి
దాఁటరాదబలనీవు॥ 61

గీ॥ భర్తయుందుండు జ్ఞానసంపత్తినీవు గొ
ప్పగానెంచవలయు దుర్గుణముఁలగని యింపఁ

గారాదు కల్లైనన నిగుఱుఁబోఁడి॥ పరునిపొం
దెంచవలెఁ దృణప్రాయముగను॥ 62

గీ॥ కీర్తి వచ్చిన మఱియపకీర్తి వచ్చె। నేని
సుదతి కారణమండ్రు నిజముగాను। బతికివాని
కెన్నఁడును లోపంబురాక। యుండబుద్ధిఁగల్గి
నడచుచుండవలయు॥ 63

గీ॥ వనితపుట్టింటఁ గల పరిజనముకంటె। న
త్తవారిసేవకులనత్యధిక ప్రేమ। నరయుమాఁడు
బిడ్డలయెడనత్తలయెడ। వినయమునువిధేయత
నుజూపింపవలయు॥ 64

గీ॥ నీకుభృత్యవర్గంబుపై నిశ్చయముగ।
నెంతప్రేముయుండినఁ జనవివ్వఁబోకు। మెప్పు
గా నీయెడల భయముండవలయు। నట్లుమసలం
గఁ జేయుమోయన్నుమిన్న॥ 65

గీ॥ ఎఱిఁగి యెఱుఁగక నీచోటనెన్నఁడేని।
దాసదాసీజనముతప్పుఁ జేసెనేని। వారినిఁకఁ జే
యకుడని చీవాట్లుఁబెట్టు। మబల దానినేపట్టి
పాలార్చఁబోకు॥ 66

క॥ పండుగపబ్బములగునెడ। నిండగుభక్తిం
జరించునీసేవకులకుఁ బొందుగఁ దనుపుమఱిను

జవ, కంఠఁగభోజనమొసంగికువలయనేత్రీ॥ 67

ఆ॥ వె॥ వేలకొలఁది నీకుభృత్యులుండినఁ గాని। వరునకీవె సేయవలయుఁ బనులు। ఎంత రాణివాసమింటఁ బుట్టినఁగాని। నారిభర్తకును ఆ పరిచారికేయగు॥ 68

తే॥ ఒరులునుతియింప మదిలోన నుబ్బఁబోకు। సేయుదానమువెల్లడిఁ జేసికొనకు। క్షితిఁ గలుషములనీదరిఁజేరనీకు। లలనసత్కార్యమందువలదు పరాకు॥ 69

గీ॥ ఎన్ని సౌఖ్యంబులుండిన నెందుకొరకు దేహసౌఖ్యంబు లేనిచోఁదెలివనీకుఁ। గానఁగాపాడుజాగ్రత్త గానుసతము। స్నానపానాదివిధులనుసల్పుచుండి॥ 70

ఆ వె ఒ స లకలిమిఁజూచి యోర్వలేనితనముఁ। బూనయోగ్యమానెదాననేమిః వచ్చుభామినిమదినొచ్చుదయువమును। సంస్తుతించుమధికసంపదలిడ॥ 71

ఆ॥ వె॥ పనియుఁబాటులేక పలుమారుపొరుగిండ్ల। కేఁగఁబోకునిన్ను నెల్లిదముగఁ। జూతురదియుఁగాకనోతి నిందలుపచ్చు। గౌరవంబునీకు

దూరమగును॥ 72

క॥ ఏకాంతస్థలముననీ। వేకాంతముగసుతు
తోడ నేనియుఁ బలుకం। బోకుము లోకులకాకా
కుల। మూఁకలులోకంబు మూయమూఁకుఁ దు
గలదే। 73

ఆ॥ వె॥ ఎంతరూప హీనుఁ లేనియుఁ బరుల
సం। తతనిఁ గాంచినవ్వఁదగదుబోఁటి। కటకటద
లుప మిటుగావించెననిజాలిఁ। బొందుటొప్పు
మిగుల డెందమందు॥ 74

గీ॥ పరులుబలు కష్టములచేతవనటఁజెంది।
వసుధనీదుసాయంబునుబడయఁదలఁచి। నిన్నుఁ
బ్రార్థించవినువకసన్నుతాంగి। చేతనైనట్టి మే
లును జేయుమెప్పుడు॥ 75

గీ॥ ఒట్టులనుమాటిమాటికిఁబెట్టఁబోకు। క్షి
తినిదొంగతనం బెప్డుఁ జేయఁబోకు। జిహ్వకింపు
గాఁబాకంబుసేయనేర్చు। కొమ్మకుట్టుపనిఁదెలిసి
కొమ్మకొమ్మ॥ 76

గీ॥ ప్రాణికోటిపై దయనిల్పుమాత్మలోనఁ।
జామహానిఁజేయకుమునిష్కారణముగ। నఖిలధ
ర్మములకుమూలమాయహింస। యంచుఁబెద్ద

లుసెప్పుటనెంచఁగలరె॥ 77

గీ॥ ఎంత లేమిచేతను గృశియించు చున్నఁ।
బుట్టినింటికిమఱి మెట్టినట్టియింటి। కిలను జెట్టఁదే
కుండ నీ వెట్లు నడవ। పలయు గుట్టుమట్టుఁగలిగి పం
కజాక్షి॥ 78

క॥ బోటిరో కోపముఁబూనుట। వాటము
గాదనుచుఁ దెలిసినదె యిలను దానిన్। సూటిగ బా
లురు బంట్లును। బాటిఁదొలంగు నెడఁబూనవల
యునుజుమ్మా॥ 79

గీ॥ పొంచి వినఁబోకు మొరులాడ మించుఁబోఁ
డి। ఘోరహాస్యమదియు యుక్తమారయఁగను।
బరులు సేసిన మేలును మఱవఁబోకు। మిహపరం
బులకటులైననెడఁబువచ్చు॥ 80

క॥ పెద్దలమదికి హితంబుగ। నొద్దికఁజరి
యించుచు మఱి యొప్పుగ నాజ్ఞల్ హద్దుగనొనరిం
పందగు నద్దానన్ శ్రేయమబ్బు నవనీస్థలిలోన్॥ 81

గీ॥ నక్కవినయమును బకధ్యానంబు సూపి
చెలువకార్యమగు వఱకు స్నేహమునకుఁ బాత్రు
లైయుండి పిమ్మటఁ బాయుచుంద్రు కొందరట్టి
తుచ్ఛులఁగనుఁగొనఁగవలెను॥ 82

గీ॥ వట్టినె లేనిపోనట్టి పంతమూని ।
మాటిమాటికిఁ గొందరుబోఁటులలిగి। భోజన
ము మానుకొనుచుంద్రు పొలఁతియదియుఁ
గూడదంచెఱిఁగినడచుకొనఁగరాదె॥ 83

క॥ మృదుసంభాషణ సుగుణుల హృద
యానందంబుఁ జేయు నెంతయుఁ దలఁపఁగా। మదవ
తిరొ పలుకునెడనె। మ్మదినుంచంగవలయు మఱి
వకదానికా॥ 84

గీ॥ పనులుసేసినఁ గీర్తి లోపంబురాదు। భ
వినిరాణివాసముఁ దగ్గిపోదు మఱిజగమునఁదొ
య్యాలి దేహసౌఖ్యంబుగల్గు। వినయవంతురాల
వటంచుఁ బేరువచ్చు॥ 85

గీ॥ పనులఁ జేయక మహారాణివలెన్న దిను
చుఁ గూర్చొనుట గొప్పగా నెంచుకోకుతన్వి
దానిచేనజీర్ణంబు మొదలగు పెక్కు। రోగముల్సం
భవించు నిరూఢిగాను॥ 86

గీ॥ మానినీయెప్డుఁ దెలవాఱఁగానె వేగ, లే
చి తీర్పంగవలయును బ్రాఁచిపనుల,వలదుప్రొ
ద్దెక్కుదాఁకను బండుకొంట,లేనిచో నిన్ను మొ
ద్దంద్రు మానవతులు॥ 87

గీ॥ పెండ్లిపేరంట్రములకేఁ గవిద్రుమమో
ష్టు! లెరవు నగలధరించెద రెంతో ఘనత! వడ
యునదితగున గుణసంపత్తి కంటెఁ! గలదె స
ద్భూషణము వేరె జలజవదన॥ 88

గీ॥ నీనగలు నాణెములఁజూచినిన్ను మెచ్చ
రెపుడు సజ్జనులావ్వారల హృదయమందు! నీకు
గలనమ్రభావంబునీతిఁ గాంచి! ఘనముగా మె
త్తురేకాని కామిలుగంటి॥ 89

గీ॥ కష్టపునందొక్క కొమరుండుగల్గిమఱి
యుఁ!గోడలుతమకు రాఁగానెకోసిపెట్టు! సాగు
చుంద్రుపూర్వావస్థ జ్ఞప్తిలేక! మూఢవనితల
టులఁజేయఁబోకుమెపుడు॥ 90

గీ॥ అత్తలాడుఁ బిడ్డలును దమ్మనవరతము
మిగులశ్రమఁ బెట్టుదురటంచు వగలువూని
పొరుగువారితోఁ గొందరు మొఱ్ఱవెట్టు! చుం
ద్రమ మూర్ఖతయది తగదుగ్మఖులకు॥ 91

గీ॥ కష్టములురాఁగ ధైర్యంబుగాంచఁగా
ను! వలయునెత్తి బాదుకొనియేడ్వంగఁ బోల!
దట్టులఁ! జేయంగమదికి నాయాసమబ్బుఁ గొం
చెమైనను లాభంబుగూడిరాదు॥ 92

గీ॥ పడఁతిపిల్లి మీఁదనుకోశిపై నునెపము
వెట్టితఱచుగాఁగాట్లాడితిట్టుకొంద్రు బుద్ధిహీను
లై కొందరుపాలఁతులదియుఁ దగదటంచెఱిఁగి
మెలఁగఁదగునుజుమ్ము॥ 93

గీ॥ కాంతరో యింటిగుట్టు లంకకనుజేట
నడి విధంబుగాఁ జాటుననిన్నుఁ గేళిసేతురిర్గ
పార్గుజనులుసిద్ధమిదియ। యెంతబాధైనలోనె
సహించవలయు॥ 94

క॥ వినుమెప్పు ఋణమొనర్చకు। మనోహ
రునిచాటుగాను మఱిశక్తికిమించి। చినవాగ్దాన
ము సేయకు, ననఁబోఁడిరో గౌరవంబునకు ను
న్నయగుణ॥ 95

గీ। ముదితమొక్కకు భర్తకు ముందుగాను
భువినిఁ బిల్వనిపేరఁటమునకుఁబోకు। మెప్పుఁజె
ప్పుడు మాటలాలించియెదుట। వారినిమదిని
దూషింపవలదుసుమ్ము॥ 96

గీ॥ భోజనముఁ బెట్టువేళలఁ బువ్వుఁబోఁడి
పంక్తిభేదంబుసేయకు వసుధలోన। నట్లుసేసి
నఁ గీర్తికిహానికరము। వచ్చుబడిఁ గాంచిమఱి
సేయవలయుఁగర్చు॥ 97

గీ॥ ఎవ్వ రేది సెప్పినఁ జెవియిచ్చి వినుము। వీ
రునాకుఁ జెప్పెడిపాటివారెయంచు। విఱ్ఱవీగు
టఁగూడదు బిసరుహాక్షీ యందుమంచియున్న
ను దానికనుమతించు॥ 98

గీ॥ మొలఁతకొందరుకడుపారమెక్కితమకుఁ
బనియుఁబాటును లేకుండవారలట్టి। వారలిట్టి
వారని పొగ్గువారిలోపముల గణించుట్రి మూ
ర్ఖతయది తెలియవలయు॥ 99

గీ॥ ఎన్నిపనులున్న మఱవక సన్నుతించు। ప్ర
తిదినంబును దేవునిభక్తితోడఁ గాంత ప్రొద్దువు
నిర్మల స్వాంతమందు। నిఖిల సౌఖ్యంబులొడఁ
గూర్చినిన్నుమనుప॥ 100

గీ॥ యువతులకు హెచ్చుగానుపయోగపడఁ
గఁ, బుస్తకంబునకుసతీసుబోధినియని, పేరిడిర
చించెనెంతయువెలయునట్టి, యోజదాట్లసీతా
రామరాజుదీని॥

క॥ హితమతులై సంతసమిూ, సతీసుబోధినిఁ
బఠించిచరియించినస, న్నుతిఁగాంతురుపణఁతు
లుక్షితి,క్షితిలేనిసుఖంబుఁజెందిశ్రీహరికృపచేఁ॥

సతీసుబోధిని సంపూర్ణము.

## సి. హెచ్. రామమూర్తి అండ్ సన్సు,
## విజయనగరం.

### దక్షిణదేశపు గ్రంథములు.

#### పురుషులకు శుద్ధపత్రికలు.

| | | | |
|---|---|---|---|
| గురుమంత్రము, తత్త్వన్యాసము, మాతృకాన్యాసము, హంస, నారాయణ, కృష్ణమంత్రములుగల పత్రిక. | 0 | 1 | |

#### స్త్రీలకు శుద్ధపత్రికలు.

| | | | |
|---|---|---|---|
| గురుమంత్రము, కృష్ణ, హంసమంత్రములు, సంకల్పవిధానములగల పత్రిక. | 0 | 1 | 0 |

#### శుద్ధపత్రికలు.

| | | | |
|---|---|---|---|
| ఋగ్వేద, యజుర్వేద, పురుషసూక్తం, శ్రీసూక్తం, మన్యుసూక్తం, భూసూక్తం | 0 | 1 | 0 |

మంగళగిరి కృష్ణశాస్త్రి పాయసకవి [illegible] రచియింపబడినవి.

| | | | |
|---|---|---|---|
| శృంగారచాటూక్తి | 0 | 2 | 0 |

#### తోలేటి సీతారామయ్యగారిచే రచియింపబడిన గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| సురాభాండేశ్వరకథ-కీర్తన- ఆనందభైరవిరాగం. | 0 | 1 | 0 |
| కలికాలప్రవర్తనాభివర్ణన | 0 | 0 | 6 |

#### అడిదము సన్యాసికవిగారిచే రచియింపబడిన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| హరిశతకము | 0 | 1 | 0 |
| రుద్రశతకము | 0 | 1 | 0 |

